# జమీన్‌రైతు

ESTD. 1930
Regd. No. H. NL. 18
సంపుటి: 59 సంచిక: 47
25-11-1988
నెల్లూరు
శుక్రవారం
14 పేజీలు రూపాయి

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు
మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి




1975 జూలై 4 తేది ఆనాటి ముఖ్యమంత్రి జలగం వెంగళరావు శంకుస్థాపన చేయకముందు సోమశిల ప్రాజెక్టు ప్రదేశ సుందర దృశ్యం

◄సోమశిల►



రేపు (26తేది) ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావు ప్రజలకు అంకితం చేయబోతున్న పూర్తి అయిన అసంపూర్ణ సోమశిల ప్రాజెక్టు చిత్రం

# అగర్వాల్ కోసం ఇంత ఆగమెందుకు?

**మా రాజకీయ పరిశీలకుడు**

లోకాయుక్త నియామకం పేరుతో ఒక పెద్ద రాజకీయ సంక్షోభం సృష్టించటంలో ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు సఫలీకృతులైనారు. ఆందోళనలుగా రూపుదిద్దుకొంటున్న నిరుద్యోగుల, ఆర్. టి. సి. బస్‌ఛార్జీల పెంపు, పాలకవర్గం పెంపొందుతుంటే సమస్యలనుంచి ప్రజల దృష్టి మళ్ళించటానికి మంచి ఎత్తుగడే వేశారు! తనకు తనపార్టీకి విద్యా, ధీరాలు ఎదురైనప్పుడల్లా ఇటువంటి రాజకీయ వివాదాలు కల్పించి, ప్రజలను మభ్యపరచటంలో ఆయనకున్న ప్రజ్ఞాపాటవం. దాన్ని ఇప్పుడు మరొకసారి ప్రదర్శించారు.

నిజానికి లోకాయుక్త అంత ప్రాధాన్యత కల్గిన పదవేమీకాదు. రాజకీయవాదులలో అవినీతిని అదుపుచేయడానికి ఉద్దేశించిన ఈ సంస్థ ఇప్పటివరకు ఒక్క మంత్రినో, ఎమ్మెల్యేనో మందలించిన పాపాన పోలేదు. అధికారంలో వున్నవారి ఆగ్రహానికి గురైన ఉద్యోగుల ప్రాణాలు తోడటానికే, పిడివెళ్ల మాంగర్లవంటి పెండింగ్ దానికే ఇది వుపయోగపడుతుంది. అన్నం సాంబశివరావు వంటి పరిణతి కల్గిన న్యాయమూర్తి సారధ్యంలో నడిచిందికాబట్టే దానికి ఇంకా ఆమాత్రం గౌరవమైనా మిగిలి వుంది.



ఇట్లా చేతులతో దాసోహం దాగలిగితే 'అన్న' గారిదే వుందరుగదా!



ఇంతటి చిన్నపదవి నియామకానికి ఇంత పెద్ద రభస సృష్టించటం ఒక్క ఎన్టీఆర్‌కే చెల్లు. ఈ నియామకం చేయాల్సింది గవర్నరు; అయితే ఆమె మంత్రివర్గం సిఫార్సుకు కట్టుబడే వుండాలి. నియామకపు ఫైలు గవర్నర్‌కు చేరకముందే ఎన్టీఆర్ లోకాయుక్తగా ఢిల్లీ హైకోర్టు మాజీ న్యాయమూర్తి శ్రీ ఆర్ ఎన్ అగర్వాల్‌ను నియమించినట్లు ప్రకటించి, ప్రమాణ స్వీకారోత్సవానికి సన్నాహాలు చేసేశారు. అగర్వాల్‌గారు ఢిల్లీ నుంచి హైదరాబాదువచ్చి ప్రభుత్వ అతిథి గృహంలో విడిదిచేశారు.

తీరాచూస్తే ఈ నియామకంపై మంత్రివర్గ తీర్మానంలేదు. ఎన్టీఆర్ దృష్టిలో సర్వం తానుతప్ప, మంత్రివర్గమంటూ ఏదీలేకపోవచ్చు; కానీ గవర్నర్ చూసేది చట్టమేకదా! చట్టంప్రకారం మంత్రిమండలి సిఫార్సులేని ఫైలును తానెందుకు పరిశీలించాలని తిప్పిపంపింది. దానితోపాటుగా, నియామకానికి ముందే ప్రమాణస్వీకారోత్సవ ఏర్పాట్లు సమంజసమా అని ప్రశ్నించింది.

తాననుకున్నపని జరగకపోయేసరికి అన్న ఆగ్రహోదగ్రులైనారు. అసాధారణ రీతిలో 33 మంది మంత్రులచేత సమైక్య ప్రకటనలిప్పించటం, రాష్ట్రపతికి టెలెక్సులు పంపటం, పార్లమెంటులో ప్రస్తావింపచేయడం వంటివన్నీ చేశారు. ప్రభుత్వ నిర్వహణకు గవర్నరు రాజకీయ కారణాలతో ప్రతిబంధకం ఏర్పరుస్తుందన్న అభిప్రాయాన్ని ప్రజలలో కల్పించటానికి యత్నించారు. దీనికి తగినట్లే గవర్నరు రెండవసారికూడా ఫైలు తిప్పిపంపింది. ఇప్పటికీ మంత్రివర్గ తీర్మానం లేదన్నది ఆమె ప్రధాన అభ్యంతరం.

గవర్నర్ ఇప్పటివరకు ఈ ఫైలుపై వివరణలు కోరిందేకాని, తిరస్కరించలేదు. రాజ్యాంగాధినేత అయిన గవర్నర్‌కు వివరణలు కోరే హక్కు రాజ్యాంగబద్ధంగా సంక్రమించింది. దీలోగా ఏదో కొంపలంటుకపోతున్నట్లు ముఖ్యమంత్రి ఆగం చేయడం విచిత్రంగా, విడ్డూరంగా వుందని పరిశీలకులు వ్యాఖ్యానిస్తున్నారు. మొత్తంమీద ఈ సంఘటన రాష్ట్రంలో పెద్ద సంచలనం రేకెత్తించింది. తెలుగుదేశంతో పాటు సహజంగానే లోకపార్టీలు, బిజెపి, సిపిఎం, జనతాదళ్ చేతులు కల్పాయి.

—తరువాయి 8వ పేజీలో

# జమీన్ రైతు

## యూత్‌కాంగ్రెస్ అవసరమా?

యూత్ కాంగ్రెస్ అంటూ కాంగ్రెస్‌కు ప్రత్యేకంగా ఒక అనుబంధసంస్థ అవసరమా? పదవుల కార్యక్రమాలు, పోటీలు పోరాటాలతో యువకుల మనసులను విషతుల్యం చేయడానికితప్ప కాంగ్రెస్ బలాన్నిగాని, ప్రతిష్ఠనుగాని ఇనుమడింపజేయడానికి ఇది ఏవిధంగానైనా దోహదమిస్తున్నదా? వారిన ఊర్వ భాస్కరరావు స్థానంలో కేంద్ర మంత్రి శ్రీ శివశంకర్ కుమారుడు సుధీర్‌కుమార్ రాష్ట్ర యూత్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా నియమితులైన తర్వాత చెలరేగిన వివాదప్రకటనలు; కొత్త అధ్యక్షుడు నెల్లూరు వచ్చిన సందర్భంలో యూత్ కాంగ్రెస్ మూడువర్గాలుగా సాయుధంగా యుద్ధానికి సిద్ధం కావడం చూసినతర్వాత కాంగ్రెస్‌ను భ్రష్టుపట్టించడానికి, యువకులను పెడత్రోవపట్టించడానికి, ప్రజాసేవారంగాన్ని కలుషితంచేయడానికి తప్ప యూత్ కాంగ్రెస్‌వల్ల ఒరిగేదేమిటి అనిపించడంలేదా?

ఆంధ్రప్రదేశ్‌సహ కొన్ని రాష్ట్రాలలో పంచాయతీఎన్నికలకు సంబంధించి ఎప్పుడో ఓటింగు వయస్సు పద్దెనిమిదేళ్ళకు తగ్గించబడింది. అంటే పద్దెనిమిదేళ్ళ వయస్కులు ప్రతిఒక్కరు ఓటరయ్యారు. పార్లమెంటు, శాసనసభ ఎన్నికలకుకూడా ఓటింగు వయస్సు ఇరవైఒకటి నుండి పద్దెనిమిదేళ్ళకు తగ్గించాలని ఇటీవల ఢిల్లీలోజరిగిన అఖిలభారత కాంగ్రెస్ కమిటీ ప్రభుత్వానికి సిఫారసుచేసింది. ప్రభుత్వం ఈమార్పు చేయదలచుకొనే ఏ. ఐ. సి. సి. చేత ఈ తీర్మానం చేయించివుంటారు గనుక, ఇది తప్పక అమలుజరిగితీరుతుంది. ప్రతిపక్షాలూ ఓటింగు వయస్సు తగ్గింపుకు ఎప్పుడూ సుముఖమే. ఓటింగు వయస్సు తగ్గి, పద్దెనిమిదేళ్ళ యువకులందరూ ఓటింగు అర్హత పొందినప్పుడు, ఆటువంటివారు కాంగ్రెస్‌లోనేకాదు, ఏ పార్టీలోనైనా సభ్యులు కావడానికి అభ్యంతరం వుండవలసిన అవసరంలేదు. యువకులకంటూ ఏపార్టీలోనైనా ప్రత్యేకవిభాగం అనవసరం. అందువల్ల యూత్ కాంగ్రెస్ ప్రత్యేకంగా కొనసాగవలసిన అవసరంలేదని మా అభిప్రాయం; వారందరూ కాంగ్రెస్ సభ్యులుగానే చేరవచ్చు, కాంగ్రెస్‌లోనే పదవులు అలంకరించవచ్చు.

రైతులు, కార్మికులు, విద్యార్థులవలె యువకులది వర్గసంఘం కాదు. రైతులకు వారి సమస్యలు అనేకం వున్నాయి; వాటికోసం ఆందోళనచేయడానికి వారికి ప్రత్యేకంగా ఒక సంఘం కావాలి. అట్లనే కార్మికులు తమ స్థితిగతులు మెరుగుపడడంకోసం, తమ హక్కులను కాపాడుకోవడంకోసం సంఘటితం కావలసిన అవసరంవుంది. విద్యార్థులకు రాజకీయాలు అవసరంలేదని, వారు రాజకీయాలలో పాల్గొనకూడదని, వారు కేవలం చదువులకే పరిమితంకావాలని రాజకీయ నాయకులు వేదికలమీద నీతులు చెప్తారుకాని, తమ అవసరాలకు విద్యార్థులను వుపయోగపెట్టుకోవడంలో వారే మొదటివారవుతారు. కాకపోయినా, విద్యార్థులులేని ఏ వుద్యమమూ స్ఫూర్తిని పొందలేదు; వూపును వుత్తేజాన్ని వుత్సాహాన్ని పొందలేదు. లాభనష్టాలు, ముందువెనుకలు, కష్టసుఖాలు ఆలోచించకుండా ఫలాపేక్షరహితంగా నిర్మలహృదయంతో అగ్నిలోనైనా దూకేవారు విద్యార్థులు. అందువల్ల ఏ వుద్యమానికైనా వారు వూపిరి. అదీకాక విద్యార్థి సమస్యలూ అనేకం వుంటాయి; వాటికోసం పాటుపడవలసినవారూ విద్యార్థులు. ఇటీవల విద్యార్థి వుద్యమాలు వెర్రితలలు వేస్తున్నాయి, విద్యార్థులు పెడదారి పట్టింపబడుతున్నారుగాని, చదువులకు భంగంలేకుండా దేశానికి సంఘానికి విద్యార్థులవసరం; విద్యార్థిసంఘాలూ ప్రత్యేకంగా అవసరమే. అట్లనే మహిళలకు కూడా.

వర్గసంఘాలు ఎన్ని ఏర్పడ్డా నష్టంలేదు; వ్యతిరేకించవలసిన అవసరం లేదుకాని; కులమత సంఘాల ప్రాబల్యం ఇటీవల దేశంలో ఎక్కువైపోతున్నది. భాషాభేదాలు, ప్రాంతీయతత్వాలు పెచ్చు పెరిగిపోతున్నాయి. అనర్థదాయకమైన ఈ దౌర్భాగ్యాలకు, తత్వాలకు రాజకీయ వాదులు కనీసం విద్యార్థులనైనా అతీతంగా వుండనివ్వగలిగితే భవిష్యత్తు కాస్త ఆశాజనకంగామారే అవకాశముంటుంది.

సంఘాలు పెరిగితే వివాదాలు పెరుగుతున్నాయి, ద్వేషాలు పెరుగుతున్నాయి, పదవులపిచ్చి పెరుగుతున్నది; అందులో వుడుకు రక్తంగల యువకులు అప్రతిహతంగా వ్యవహరిస్తున్నారు. క్రమశిక్షణలేని కాంగ్రెస్‌లో ఈ అవాంఛనీయ పోకడలు మరీ ఎక్కువ. దాని వునికే అవసరంలేని యూత్ కాంగ్రెస్ వంటి సంఘాలను రద్దుచేసి, ఆ యువకులందరికీ కాంగ్రెస్‌లోకి స్థానం కల్పిస్తే, మరీ మునుపటి వలె లేకుండా, పార్టీ యువశక్తితో, యువజనంతో కళకళలాడుతుంది!

# జమీన్ రైతు

25-11-1938
20 పేజీలు అణా

### ప్రెసిడెంటు స్వయంవరము

అంకితము

ఈ నీరసము స్వవశ ద్రోహము
పరమని సరసమ్ము నమ్మి-
పలుసాదులు అ
దురితమ్ముల కారగట్టిన
తిరుమల కొండారెడ్డిగారి
దివ్యచరితకు-.

-చిత్రగుప్తుడు-

అది ఉదయముహూర్తం. 21తేది సోమవారం మార్నింగు కాఫీ ఫొంచేసి వస్తాయింది అందరు 9½ గంలకు బోర్డు ఆఫీసుకు చేరారు.

రాత్రంతా జాగరణ చేసిన గోయిందన్నపార్టీవారు ముందుగా వచ్చి కూర్చున్నారు. కాంగ్రెస్ పార్టీవారు తర్వాత వచ్చి సుఖాసీనులైనారు.

కలెక్టరుగారు సరిగ్గా 9½ గంలకు బోర్డుభవనంలో కుడికాలుపెట్టారు.

మొదట కలెక్టరుగారు రాజభక్తి ప్రమాణంతో కథ ప్రారంభమైంది.

ప్రథమంలో గోయిందన్న మఠం తరఫున వెంకట్రామిరెడ్డి ప్రవేశపెట్టారు. ఉన్నపాళెపుదొర అల్లాయి నాయుడు యం. ఎ. గారు బలపరిచారు. వంగల్లు కోదండరామిరెడ్డిగార్ని దేవరపల్లి కోటమ్మ పుత్రుడు ప్రవేశపెట్టారు. నెల్లూరు మండల ఏకైక

### 50 ఏళ్ల క్రితం ఈ వారం

కాంగ్రెస్ మహమ్మదీయ నాయకుడు జనాబ్ సుల్తాన్ సాహెబుగారు ఆమోదించారు.

ఇతర రంగులు మాసిపోతవని మట్టి రంగు పెట్టె పెట్టి గోయిందన్న కోరుకొన్నారు. - కాంగ్రెస్ పసుపురంగు పెట్టెను కోదండరామిరెడ్డిగారు కోరుకొన్నారు. ఇక్కడాగూడా గిట్లుగిరే పద్ధతిపోయి రంగు పెట్టెలపద్ధతి వచ్చిందని అందరికి తెలిసింది.

సభ్యులు 61 మంది హాజరైనారు. అధ్యక్షపీఠ్ధరూ ఓటువేయలేదు. ఒక్కిన 49 మంది ఓటువేశారు. ఓటువేసిన వార్డును ఓటువేయనివారితో కలవకుండా వెలవేటవుంచారు.

రెండుపెట్టెలు తెరిచారు. ముందు గోయిందయ్య మట్టిరంగుపెట్టె తెరిచారు. ఎంచితే 23 మాత్రమేవచ్చినవి. తర్వాత పసుపుపెట్టెలో లెక్కపెడితే 26 వచ్చినవి. దట్టప్రకారము కోదండరామిరెడ్డి గెల్చాడని గోయిందయ్య గూడ ఒప్పుకొన్నారు.

* * *

కోదండరామిరెడ్డితో గూడా కాంగ్రెస్‌కు ఇచ్చినవారు 27 మంది.

అత్తివరం వెంకట్రామిరెడ్డితో కలిపి ఇవ్వనివారు 8 మంది.

* * *

నా లెక్కప్రకారం ఇవ్వనివారు: (1) తిరుమల కొండారెడ్డి (2) బాగండి (3) అమిరెడ్డి వెంకటసుబ్బయ్య, (4) చెంచయ్యనాయుడు (5) ఈపూరు బలరామిరెడ్డి, (6) పెద్దిసెట్టి రంగయ్య (7) అత్తివరం వెంకటరామిరెడ్డి, (8) అక్కపనాయుడు.

## పదవి భార్యకు - అధికారాలు భర్తలకా?

జిల్లాలోని మహిళా మండలాధ్యక్షుల విషయంలో వారి భర్తల ప్రవర్తన విచిత్రంగా వుంటున్నది. తమ భార్యల పదవులకు చెందిన అధికారాలన్నీ తామే చలాయించాలంటున్నారు వీరు. తెరవెనుక వైళ్ళను నడిపించడంవరకైతే ఫర్వాలేదు. వేదికలమీద తామేమండలాధ్యక్షులమన్నట్లు ప్రవర్తిస్తున్నారు. అధికారవర్గ దర్బారులకూ హాజరవుతున్నారు. మొన్నొకరోజు ఒక మండలాధ్యక్షురాలి పతిదేవుడు కలెక్టర్ ఇంటర్వ్యూకోసం చేసిన ఆగంచూస్తే ఆశ్చర్యం కల్గింది.

మహిళలకు రిజర్వేషన్లు చేసింది-పరిపాలనలో వారికి భాగస్వామ్యం కల్పించడానికి! జీవితభాగస్వామ్యంలోవలె వారి పదవులలోకూడా తమకు భాగస్వామ్యం, అధికారం వుందని భర్తలు భావిస్తే ఇక ఈ రిజర్వేషన్లెందుకో. దండగ!

నెల్లూరు -డి. వి. ఎం. రావు.

### ఆర్టీసీ ఛార్జీలు పెంచడం అన్యాయం

ఆర్టీసీ బస్ ఛార్జీలు ఆరునెలలక్రితం పెంచారు. అయినా ఆర్టీసీకి నష్టాలు వస్తున్నాయనే కుంటిసాకుతో మళ్ళీ బస్‌ఛార్జీలు పెంచడంమాత్రం అన్యాయం. ఈ బస్సులకు సరియైన టైమింగ్సు వుండవు. అవి ఎప్పుడువస్తాయో ఎప్పుడు పోతాయోకూడ ఎవరికీ తెలియవు. అందువల్ల ప్రయాణీకులు చాలా అవస్థలపాలవుతున్నారు. ముఖ్యంగా విడవలూరు కళాశాలకు పలు ప్రాంతాలనుంచి వచ్చిపోయే విద్యార్థులు సరియైన టైంకు చేరుకోలేకపోతున్నారు. కనుక ఆర్టీసీ అధికారులు ఈవిషయాలను దృష్టిలోవుంచుకొని పెంచిన బస్‌ఛార్జీలను తగ్గించాలని, బస్సులను సరియైనటైమింగ్సులో నడపాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

విడవలూరు - కె. హరి.

### ఖాతా మూసేసినా పాస్ బుక్కులు కొనాలా?

అల్లూరి పోస్టాఫీసులో నాపిల్లలపేరుతో మూడు సేవింగ్స్ అకౌంట్లు వున్నాయి అయితే వాటికిసంబంధించిన పాస్‌బుక్కులు మాత్రం చెదలు తినేశాయి. ఆ అకౌంట్లను క్లోజ్ చేయమని అడిగితే ముందు రూపాయి పాస్‌పుస్తకాలు కొని, ఆ తర్వాత క్లోజ్ చేయమన్నాడు. ఖాతా మూసేసేటప్పుడు కొత్తపుస్తకాలెందుకని వాదించినా విన్పించుకోలేదు. ఉన్నతాధికారులకు పిర్యాదుపంపితే జవాబులేదు. జూలైనెలనుంచి ఈ విషయమైనా వాదనలు, విన్నపాలు ఫలించనేలేదు.

# జనవాణి

నేనుకట్టినడబ్బు నేను వెనక్కుతీసుకోడానికి ఎందుకింత ఇబ్బంది పెడుతున్నారో అర్థమేకాదు. ఉన్నతాధికారులెవరైనా జోక్యంచేసుకుని పోస్టల్‌శాఖ పట్టిన మొండిపట్టును విడిపించకూడదా?

### కూర్చోమంటే ఏంబోతుంది?

ప్రభుత్వ కార్యాలయాల్లో పనిచేసే గుమాస్తాలు బండచాకిరీ చేస్తుంటారు. ఈ గుమాస్తాలు ఏఫైల్ గురించైనా చర్చించడంకుగాని, సమస్యలు చెప్పుకునేందుకుగాని అధికారిని కలుసుకున్నప్పుడు ఒక్కోసారి గంటల పర్యంతం నిలబడే వుండాల్సి వస్తుంది. ఈ గుమాస్తాలను కూర్చోమని ఏ అధికారీ చెప్పడు. చెప్పకుండా కూర్చుంటే అది అవిధేయతగా భావించిన అధికారి ముఖం వివర్ణమవుతుంది. ఫలితంగా గుమాస్తాలు అభిమానంకోల్పోయి ఆయన ఆగ్రహానికి గురవుతుంటాడు.

తమ వృత్తిని శ్రద్ధగా, విజాయతీగా, నైపుణ్యంతో నిర్వహిస్తున్నప్పటికీ-గుమాస్తాలను అధికారులు చిన్నచూపు చూస్తున్నారు. ఈ విధానాన్ని విడనాడి, కనీసం కూర్చోమనే విషయంలోనైనా గుమాస్తాలను అధికారులు గౌరవించాలని నా మనవి.

ఎల్లాయపాళెం - కె. ప్రభాకరశాస్త్రి

# తుఫానులను తట్టుకోవాలంటే సపోటాతోటల పెంపకం మేలు!

ప్రస్తుతం వ్యవసాయం మిగత రంగాలతో పోల్చుకుంటే అంత లాభసాటిగాలేదు అనేది అందరికీ తెలిసిన విషయమే. దానికి తోడు ఏదైనా వ్యవసాయ పంటతో రోజూ అవసరంలేదు. తక్కువ శ్రమ పని చేయే పండ్లతోటలవైపు ఎక్కువ మంది రైతులు మొగ్గు చూపుతున్నారు.

నెల్లూరుజిల్లాలో అధిక వర్షం తుఫానుల బారినపడేవాలవల్ల (62 శాతం) పడుతుంది. అటుగా అక్టోబరు, నవంబరు నెలలు అంటేనే తుఫాను నెలలుగా పేరుబడి. ఈ విపత్కర పరిస్థితిని తట్టుకునేందుకు సరియైన యాజమాన్య పద్ధతులను రైతాంగం అవలంబించాల్సిన అవసరం ఏర్పడింది.

గతంలో నెల్లూరుజిల్లాలో వివిధరకాల పండ్లతోటలు తుఫాను తాకిడికి దెబ్బతిన్నంతగా సపోటాతోటలు దెబ్బతినలేదు.

డాక్టర్
సిద్దారెడ్డి ఈశ్వరరెడ్డి
ఎం. ఎస్‌సి. (అగ్రి).. పిహెచ్.డి.

ఐతేం సపోటామొక్కలు ఎక్కువ వార గలిగి వంగే గుణం కలిగివున్నందున తుఫాను తాకిడికిగూడా కొమ్మలు వంగిన దేగాని ఎక్కువగా విరిగి తోటలకు నష్టం కలుగలేదు.

అంటే తుఫాను తాకిడికి గురి అయ్యే నెల్లూరుజిల్లాలో సపోటాతోటల పెంపకం లాభసాటిగ ఉంటుందనుకోవచ్చు.

మనరాష్ట్రంలో సపోటాను రెండువేల ఎకరాల విస్తీర్ణంలో సాగుచేస్తున్నారు. సరియైన సాగుపద్ధతులను పాటించి మంచి రకాలను సాగుచేసినట్లయితే సపోటా పెంపకం మంచి ఆదాయాన్ని ఇవ్వగలదు.

### వాతావరణం, నేలలు

సముద్రతీర ప్రాంతాలు సపోటాకు చాలా అనువుగావుంటాయి. ఇది సముద్రమట్టంనుంచి 1200 మీటర్ల ఎత్తువరకు పెరిగే ఉష్ణమండలపు పంట.

సపోటా వివిధరకాలభూముల్లో తక్కగా

—తరువ 18వ పేజీలో

# పోలీసులలో అవినీతి రూపుమాపుతాడట హోంమంత్రి- ఎంత పిచ్చివాడండీ!

రాష్ట్రంలో పోలీసు సిబ్బందికి వసతి కొరకు గృహసముదాయాలను ఏర్పరచాలని ప్రభుత్వం భావిస్తున్నప్పటికీ, (గత 20 శాతం ఎందుకు వద్దనుకున్నారో) కొన్ని చోట్ల లభిస్తున్న స్థలాలు లభించకపోవడంవల్ల పోలీస్‌క్వార్టర్ల నిర్మాణవిషయంలో ఆలస్యంకావడం జరుగుతున్నదని రాష్ట్ర హోంశాఖ మంత్రి శ్రీ కోడెల శివప్రసాదరావు 20వతేది నెల్లూరులో చెప్పారు. ముప్పైలక్షల రూపాయల ఖర్చుతో నెల్లూరులో నిర్మించిన 72 పోలీసు గృహసముదాయానికి ఆయన ప్రారంభోత్సవం చేశారు.

స్థానిక పోలీస్ పెరేడ్ గ్రౌండ్స్‌లో నెల్లూరు జిల్లా క్రీడోత్సవాల సందర్భంగా ఏర్పాటయిన కార్యక్రమంలో మంత్రి శ్రీ కోడెల శివప్రసాదరావు ప్రసంగిస్తూ- పోలీసు గృహసముదాయం నిర్మాణానికి అనువుగా ఆయా ప్రాంతాలలో ఆయా స్థలాలు కేటాయించినట్లయితే పోలీసులకు గృహవసతికల్పించడానికి సిద్ధంగావున్నామనికూడా చెప్పారు.

కానిస్టేబుల్‌కు లక్షరూపాయలు, హెడ్ కానిస్టేబుల్, సబ్‌ఇనస్పెక్టర్లకు రెండు లక్షలు, సర్కిల్‌ఇనస్పెక్టర్, డి.యస్.పి.లకు మూడు లక్షలు, ఐ.పి.యస్. పోలీస్ అధికారులకు అయిదు లక్షల రూపాయలు జీవిత బీమా రక్షణ ప్రభుత్వం కల్పిస్తున్నట్లు, అసిబ్బంది ప్రీమియంను ప్రభుత్వమేచెల్లిస్తుందని మంత్రి తెలిపారు. క్రీడలలోనైపుణ్యం కలవారికి పోలీస్ రిక్రూట్‌మెంట్‌లో ప్రాధాన్యత కల్పిస్తామని మంత్రి అన్నారు. గ్రామీణప్రాంతాల్లో వర్గవైషమ్యాలను నిర్మూలించడంలో పోలీస్ సూపరింటెండెంట్ శ్రీ పి. పూర్ణచంద్రరావు చేస్తున్న కృషిని శ్రీ శివప్రసాదరావు అభినందించారు.

పోలీస్ వ్యవస్థలో అవినీతికి పాల్పడే అధికారులను కఠినంగా శిక్షించగలమని; పోలీస్‌వ్యవస్థ పటిష్టంగా పనిచేయడానికి ప్రజల సహాయసహకారాలు అవసరమని మంత్రి అన్నారు.

పోలీసులలో అవినీతి రూపుమాపుతానని హోంమంత్రి చెపుంటే ఎంత పిచ్చివాడండీ అని ప్రక్కనున్న పోలీసులే వినబడకుండా ఫక్కున నవ్వారు.

నెల్లూరుజిల్లాలో నూటఎనభై పోలీస కానిస్టేబుల్ పోస్టులు ఖాళీలను భర్తీచేయవలసి వుందని; ఖాళీలను భర్తీచేసిన తర్వాత పోలీస్ వ్యవస్థను మరింత పటిష్టంగా

### సింహపురి

రూపొందించగలమనేఆశాభావాన్ని వ్యక్తం చేశారు శ్రీ శివప్రసాదరావు. పోస్టింగులు ఎందుకు ఆలస్యమౌతున్నాయో ఆయన చెప్పలేదు.

—తరువ 10వ పేజీలో

### పి. ఆర్. రెడ్డి

685 కోట్ల రూపాయల పెట్టుబడితో కాకినాడలో నెలకొల్పబడుతున్న నాగార్జున ఫెర్టిలైజర్సులో ఫైనాన్స్ - అకౌంట్సు విభాగం మేనేజరుగావున్న శ్రీ పి. ఆర్. రెడ్డి-ఫ్యాక్టరీ యంత్రసామగ్రికి ప్రపంచ వ్యాప్తంగా పిలువబడిన 200 కోట్ల రూపాయల విలువగల టెండర్ల పరిశీలనకు 11 తేది రోంకు బయలుదేరివోయారు. అంతకు ముందు 'ఇఫ్కో' లో పనిచేస్తున్నపుడు శ్రీ రెడ్డి కంపెనీ తరఫున 1977 లో ఒకసారి, 1985 లో మరొకసారి విదేశాలకు పోయివచ్చారు. ఇది మూడవసారి; ఆయన రోంలో రెండుమాసాలపాటు వుంటారట.

శ్రీ పి. ఆర్. రెడ్డి వెంకటగిరి తాలూకా శిర్తంపాడువాసి; జమీన్‌రైతు తోద్యమ పీడుడు స్వర్గీయ పెట్టూరు గోవిందరెడ్డి మూడవ కుమారుడు; వెంకటగిరిసమితి మాజీ అధ్యక్షుడు శ్రీ రాఘవరెడ్డి తమ్ముడు. చిరకాలంగా 'జమీన్‌రైతు' పాఠకుడు.

పి. ఆర్. రెడ్డి ఇంకా వున్నతస్థితికి రావాలని మా ఆకాంక్ష.

30-11-1988 నేటే "మా కొండయ్యకు"

స్మృత్యంజలి - భాష్పాంజలి



పోయినేడు యీ తుఫాన్ నెల పన్నెండు
మా గుండెల్లో తూఫాన్ రేపిండు
ఆ నిరుపేద తలిదండ్రుల బాలచంద్రుండు
ఆ గుండెల్లో కన్నీటిని ఎవ్వరు ఆంపేడు
ఆ భార్యాబిడ్డల ఆనందాన్ని దైవం దూరం చేసిండు

ఏమైపోయావోయ్, ఎక్కడికెళ్ళావోయ్ "కొండు"
మరచిపోలేదోయ్ మేము నీ అభిమానపు మెండు
దోచుకొన్నాడోయ్ ఆ దేవుడు మా అభిమానపు చెండు
నీవు దూరమైనావన్న వాక్యము మా మనస్సును చీల్చిచెండు
అయినా కలకాలం నువు మాగుండెల్లోనే నిండివుండు

"శ్రద్ధాంజలి"తో

ఎన్నటికీ నిన్ను మరుపలేని నీవాళ్ళు.

వరికూటి మాలకొండయ్య

అసిస్టెంట్ ఇంజనీరు - థర్మల్ స్టేషన్, నెల్లూరు

•• స్మృత్యంజలి

మా అభివృద్ధికి కారకులు
నిరంతరం మా హృదయాలలో
నిలిచిపోయిన

ఈతముక్కల రామిరెడ్డిగారు

బుచ్చిరెడ్డిపాళెం

ద్వితీయ వర్ధంతి 25-11-88 తేది

వారికి శ్రద్ధాంజలి ఘటిస్తూ

-కుటుంబ సభ్యులు



జననం : 1898 మరణం : 1986

## ఆగమెందుకు (మొదటి పేజీ తరువాత)

గవర్నర్ చేసిన తప్పేమీలేదు కాబట్టి ఆమెకు మా మద్దతు వుంటుందని శ్రీ ఎన్.జనార్ధనరెడ్డి ప్రకటించారు. రెండు వర్గాలూ ప్రజలవద్దకు పోతామని, వీధుల్లో తేల్చుకుంటామని సవాల్ చేస్తున్నాయి! ఈ వార్త వ్రాసే సమయంవరకు కూడా సంక్షోభం సమసే సూచనలు కన్పించటం లేదు. ఈసంఘటనలో జన్మరేట్లు, స్కూటర్ పన్నులు ఆందోళనలు తెరమరుగై పోయాయి. ఎన్టీఆర్ కి కావలసింది అదే!

ఈ విషయంలో గవర్నర్ పాత్ర అంత వివాదాస్పదం కావటం నిజంగా విచారకరం. అయితే ఇందులో ఆమె తప్పెంతవుందన్న సంగతి పరామర్శించుకోవాలి. ప్రభుత్వం నుంచివచ్చే ప్రతిఫైలుపైనా గ్రుడ్డిగా సంతకం పెట్టాలని రాజ్యాంగం చెప్పలేదు. అందువల్లే జ్ఞాని జైలుసింగ్ పోస్టల్ బిల్లు తొక్కిపెట్టినప్పుడు ప్రతిపక్షాలు ఆయన్ను సమర్థించాయి. అదే సాంప్రదాయం గవర్నర్ కూ వర్తిస్తుంది. ఆమె నిజంగా రాజకీయ కారణాలతో ఫైలు నిలిపివుంచే ఎవరైనా అభ్యంతరం తెల్పవచ్చు. కాని ఈ విషయంలో కొన్ని మౌలికమైన ప్రశ్నలు లేవనెత్తారు. మంత్రివర్గ సిఫార్సులేకుండా నియామకంచేసే అధికారం తనకున్నదీ లేనిదీ చెప్పమన్నారామె. అంతవరకు చూస్తే గవర్నర్ పాత్రలో విమర్శనీయాంశ మేమీకన్పడదు.

ఎన్టీఆర్ మాత్రం ఈ విషయంలో చాలా దుడుకుగా వ్యవహరించారన్నది వాస్తవం. అగర్వాల్ ఆయన స్వంత న్యాయసంహారాదారుడన్న ప్రచారంవుంది; తన అల్లుడి అవినీతిపై విచారణకుకూడా ఆయన అగర్వాల్ నే నియమించారు. ఆ కేసు ఇప్పటికీ హైకోర్టులో పెండింగులో వుంది. అగర్వాల్ ఆ పదవికి తేదీవేయకుండా రాజీనామాపత్రంపంపాడట. దానిపై ముఖ్యమంత్రే వెనుకతేదీవేశారట. లోక్ అయుక్తవంటి న్యాయపరమైన పదవికి నియమించేవ్యక్తి ఇంత వివాదాస్పదుడు కావటం సమంజసమా? ఈ పదవికి తగిన న్యాయమూర్తి తెలుగువారిలో ఎవరూలేరా? అన్న కాంగ్రెస్‌వాదుల ప్రశ్నకూ ఎన్టీఆర్ సమాధానం చెప్పలేకపోయారు. ఇప్పటింత రచ్చజరిగినతర్వాత అయినా అగర్వాల్ లోక్ అయుక్తపదవిని తిరస్కరించివుంటే గౌరవప్రదంగావుండేది. ఇటు ఎన్టీఆర్, అటు అగర్వాల్ ఇద్దరిలో ఆ ఆలోచనలేదు. అందువల్ల అగర్వాల్ నియామకంతో ఎన్టీఆర్ లోక్ అయుక్తను తన జేబుసంస్థగా తయారుచేయబోతున్నారన్న విమర్శకు ఆస్కారం కల్గుతోంది.

ఏది ఏమైనా స్వల్పవిషయాలపై ముఖ్యమంత్రి ఇంత రాద్ధాంతం చేయడం ఎవరికి శ్రేయస్కరంకాదు. ఉన్నత పదవులలో వుండేవారిని కించపరచుకుంటూపోతే - ఆ పదవులపట్లనే ప్రజలలో చులకన భావ మేర్పడే ప్రమాదముంది. ★

క్రతువులే! ఎక్కువ ధర పెట్టి కొనలేక కృంగిపోయేది పరిమిత ఆదాయాలు గల వర్గాలు!

### మనుబోలుమహిళహత్య-కేసు మాయంచేశారా?

మనుబోలులో రెడ్డికులానికి చెందిన ఒక రైతు తన భార్యను కత్తితో కిరాతకంగా నరికిచంపి, శవాన్ని అప్పటికప్పుడే దహనం చేశాడట. గత ఆదివారం (20 తేదీ) ఉదయం జరిగిందట ఈ ఘోరం. తనతల్లి దారుణ హత్య విని తల్లడిల్లిపోయి, పోలీసులకు సమాచారం అందించిన ఆమె కుమార్తెను ఇంట్లో బంధించారట. దేశం నాయకుల అండతో, పోలీసుల దేవులు తడిపి బయటకు పొక్కకుండా త్రొక్కారని, కేసును మాయంచేశారని అలజడిగా వుంది.

ఎస్. పి. గారూ. ఇటువంటి దానవులు చట్టంనుంచి తప్పించుకుంటే, ఆ మహిళ ఉసురు మొత్తం పోలీసుశాఖకే తగులుతుంది. మీరు స్వయంగా జోక్యంచేసుకుని భూస్థాపితమైన దారుణాన్ని వెలికితీయండి!

### సోమశిల స్వాహా?

సోమశిల ప్రాజెక్టులో కొన్ని లక్షల విలువచేసే స్టీలు, సిమెంటు స్వాహా అయ్యాయట; కామిరెడ్డిపాడు కాల్వకుసంబంధించి; లారీలకు సంబంధించి కూడా కుంభకోణాలు పెద్దఎత్తునే జరిగినట్లున్నాయి

ప్రాజెక్టుకు రంగరంగ వైభవంగా ప్రారంభోత్సవంజరిగే సమయంలో స్వాహా వార్త అందే. పరమాన్నం త్రాగుతుండే వండ్రింద రాయిపడ్డట్టుంటుంది. సైతారం మర్చిపోకుండాలి!

### మరణం

మాజీమంత్రి, మాజీ జి. పి. చేర్మన్ స్వర్గీయ బెజవాడ గోపాలరెడ్డి సోదరుడు బెజవాడ రామచంద్రారెడ్డి గారి అనుచరుడు, కొంత పి నియోజకవర్గం నెల్లూరుజిల్లాలో వుండగా రెండుసార్లు శాసనసభ్యునిగా ఎన్నికైన శ్రీ దాగంటి రోశయ్యనాయుడు కాలధర్మం చెందారు.

### నీటిమట్టం

| | |
|---|---|
| సంగం ఆనకట్టపైన- | 0.6 అ. |
| నెల్లూరు ఆనకట్టపైన- | 0.7 అ. |
| కనిగిరి రిజర్వాయరు | 19.10 అ. |
| సర్వేపల్లి రిజర్వాయరు | 7.40 అ. |
| నెల్లూరు చెరువు | 13.70 అ. |
| గండిపాళెం | 1.3 టి. ఎం. సి. |

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు | పుట్టి | 2800.00 |
| ఐ. ఆర్. 20 | | 2600.00 |
| సన్నాలు | | 2400.00 |
| మొలగొలుకు బియ్యం (70కి) | | 850.00 |
| బంగారు సవర (8 గ్రా) | | 2860.00 |
| వెండి 10 గ్రా. | | 65.00 |

★

### జమీన్‌రైతు చందా


| | |
|---|---|
| సంవత్సరం చందా | రూ. 50-00 |
| ఆరు నెలలకు | ,, 26-00 |

విడిప్రతి ఒక్కరూపాయి


### నెల్లూరుముచ్చట్లు

(7వ పేజీ తరువాత)

ధాన్యంధర పెరుగుదల క్రమాను గతంగాకాక ఒడిదుడుకులుగావున్నా, పదేళ్ళలో పుట్టి ధర రెండు నుండి రెండున్నర రెట్లు పెరిగిందన్నమాట. ఈ పెరుగుదల వల్ల సామాన్యరైతేమైనా లాభపడుతాడా అంటే అదేమీలేదు; అతడు అవసరంకొద్దీ మాసూళ్లలోనే తక్కువ ధరకు తెగనమ్ముకుంటాడు. పెరిగిన ధరవల్ల లబ్ధిపొందేది ఇప్పటివరకు తన ధాన్యమేరాదు - సరిసుగా వున్నపుడు బరదులవికొని నిల్వ చేసుకోగలిగిన స్తోమత గలిగిన ధని

# • కన్నీటి నీరాజనం •



నా చిన్ని ప్రపంచాన్ని చీకటిమయంచేసి
అర్ధాంతరంగా నిష్క్రమించిన నా భర్త, సహృదయుడు

# శ్రీ కూకటి పేరారెడ్డిగారికి

చెమ్మగిల్లిన కనులతో, బరువెక్కిన హృదయంతో
అశృతర్పణం అర్పించుకుంటున్నాను.

కూకటి రాజేశ్వరమ్మ



"హై...హై...నాయకా"లో నరేష్, శ్రీభారతి

# చెత్త అయితే చిరంజీవి చిత్రానికైనా చెత్తబుట్టే గతి!

చిరంజీవి, రామచంద్రరావుం కాంబి నేషన్‌లో మారిషస్ లాంటి చోట్ల షూటింగ్‌లతో అత్యధిక వ్యయంతో తయారై అంతకన్నా ఎక్కువ రేటుకు అమ్ముడు పోయిన "యుద్ధభూమి" చిత్రం విజయం సాధించకపోవడంతో ఎందరో కొనుగోలు దారుల గుండెల్లో బాంబులు పడ్డట్లయింది. భారీచిత్రాలు తీసే కొందరు నిర్మాతల పాదాలకింద భూమి కంపించినట్లయింది. ఖర్చు ఎక్కువ-పస తక్కువవున్న చిత్రాలు ఎందరో కొమ్ములు తిరిగినవారితో తయారైనా తిప్పగొట్టడం మన ప్రేక్షకులకు ఇది కొత్తగాదు. అందుకే భారీచిత్రాలంటే అటోక ఆకర్షణగా భావించటం లేదెవరూ. కాని, మసిపూసి మారేడుకాయచేస్తే, కొను గోలుదారులు మాత్రం నిర్మాతల వల్లో పడి పోతున్నారు. చెట్టుపేరు చెప్పుకొని, కాయ లమ్ముకునే రోజులు ఎంతకాలం వుంటాయి?

కమర్షియల్ సినిమాల పేరుతో కేవలం

> యుద్ధభూమి
> మంచి
> గుణపాఠం!

డాన్సులకు, ఫైట్స్‌కి పరిమితం చెయ్య కుండా తక్కువ సృజనాత్మకమైన ఇటి వృత్తాంతాలతోనే తీస్తున్న పొరుగు చిత్ర నిర్మాతలనుంచి మనం తెలుసుకోవలసింది ఎంతైనా వుంది. ఒక్క మలయాళ చిత్ర రంగంలో తప్ప దాదాపు మిగతా అన్ని భాషల చిత్రాలలోనూ క్రియేటివిటీ తగ్గి పోయింది. అందుకే మలయాళ చిత్రా లెన్నింటినో వెంటవెంటనే ఇతర భాషల్లోకి రీమేక్స్ చేస్తున్నారు. మన నిర్మాతలు కూడా మలయాళ చిత్రాలకోసం ఎగబడు తున్నారు.

ఏదిఏమైనా మన నిర్మాతలు ఇకనైనా తప్పతెలుసుకోవాలి. అప్పటికప్పుడు హడావిడిగా ఏదో ఒకటి తీస్సు చుట్టేయా లన్న ధోరణిమాని, చిత్రనిర్మాణానికి పునాది అయిన కథగురించే దృష్టినంతా కేంద్రీకరించాలి. ★

## జనార్దనరెడ్డికి కృష్ణకితాబు!

ప్రధాని రాజీవ్‌గాంధీ తమిళనాడు పర్యటన సందర్భంలో మద్రాసుకు విచ్చేసి నప్పుడు అయిన్ను నవంబర్ 12 ఉదయం రాజ్‌భవన్‌లో హీరో కృష్ణ కలుసు కున్నారు. రాష్ట్రంలో కాంగ్రెస్ (ఐ)పార్టీ ప్రచారం గురించి, మరికొన్ని ముఖ్యమైన విషయాలను గురించి ముచ్చటించారు. "రాష్ట్ర పి. సి. సి. అధ్యక్షుడిగా నేదురు మల్లి జనార్దనరెడ్డి నియామకంపై మీ అభి ప్రాయంఏమిటి?"అన్న ప్రధాని ప్రశ్నకు "ఆయన అన్నివిధాలా అర్హుడు, సమ ర్థుడు. ఆయన అధ్వర్యంలో పార్టీపరిస్థితి మరింత మెరుగుపడుతుందన్న నమ్మక ముంది" అన్నాడు కృష్ణ.

మరో అయిదుగురు ఖైదుచేయబడ్డారు.

కోటీశ్వరులైన హీరోలు ఎక్కడ?

—కొరవ 18వ పేజీలో

> మద్రాసు
> సినిమా
> వార్తలు

### ప్రాణాంతకమైన హీరో అభిమానం

చిరంజీవి సినిమా 'పాటను నాగార్జున అభిమాని సరిగా పాడలేకపోవడంతో "నీకు పూర్తిగా రానప్పుడు ఆ పాటను నువ్వెందుకు పాడావు?" అని చిరంజీవి అభిమానులు, బాలకృష్ణ అభిమానులు కలిసి అడిగారు. "మీ గురువుగారి పరువుపోవా లనే అలా పాడాను" అన్నాడు నాగార్జున అభిమాని. దీంతో పెద్దగొడవ బయలు దేరింది. ప్రక్కనున్నవారు ఇద్దరినీ శాంతింపచేశారు.

ఇది కుందారం గ్రామంలో పౌరాణిక నాటక ప్రదర్శన సందర్భంగా ఏర్పాటు చేసిన వేదికపై జరిగిన గొడవ.

ఈ గొడవ అంతటితో ఆగలేదు.

ఆ మర్నాడు నాగార్జున అభిమాని వెంగుడు లక్ష్మిని చిరంజీవి అభిమాని కలి శెట్టి సూర్యారావు తలమీద బలంగా గాయ పరచడంతో వెంగుడు లక్ష్మి రాజాంహాస్పి టల్‌కు తరలిస్తుండగా అక్కడ మృతి చెందాడు. నిందితుడు సుబ్బారావుతోపాటు

# సోమశిల ప్రారంభం

(2వ పేజీ తరువాయి)

ఉత్తరకోట వెలుపు వరకు నీళ్ళు పుష్కలం గానే జరిగిపోయింది. ఆ కాల్వనీళ్ళతో నిండువలసిన చెరువులు పండిపోయిన తర్వాత, ఇప్పటొప్పు కాల్వకు 'పిల్లకాలువలు' తున్నట్లు ప్రవహించే పెద్ద ప్రవాహమైతే, అసలు కాల్వను వేసే ప్రయత్నమని గర్వంగా చెప్పుకొంటున్నారు కె. ఇ. కృష్ణమూర్తి. ప్రజలు మెచ్చుకోదగినదిగా ఆయన భావించవచ్చును.

ఏదేమైనా అనుకున్నా, ఎవరెంత విమర్శించినా ఎన్టీఆర్ అనుకున్న ఏ పనీ ఆగదు; ఈ ప్రారంభోత్సవమూ అదే ప్రకారం రేపు ఉదయం రంగరంగ వైభవంగా జరిగిపోతుంది.

• • •

ఇప్పుడు ప్రారంభోత్సవం జరుప బడుతున్న సోమశిల ప్రాజెక్టువల్ల నెల్లూరు జిల్లాలో అదనంగా ఒక్క ఎకరానికైనా సాగులోకిరాదు. అయితే నెల్లూరు సంగం ఆనకట్టల క్రిందవున్న 1,78 వేల ఎకరాలు; కనుపూరు కాల్వక్రింద 17 వేల ఎకరాలు; కావలి కాల్వక్రింద సాగౌతున్న 25 వేల ఎకరాల మాగాణి పొలానికి నీటి సరఫరా స్థిరీకరింపబడుతుంది. అంటే ఖరీఫ్ సాగుకు నమ్మకంగా నీరందుతుం దన్నమాట. నెల్లూరుజిల్లాలో 19 వేల ఎకరాల మాగాణిపైర్లకు; దక్షిణ రెండు కాల్వల క్రింద 84 వేల ఎకరాల మెట్ట పైర్లకు రబీకాలంలో నీరందించే స్తోమత ఏర్పడుతుంది.

ప్రాజెక్టుకు సంబంధించిన ప్రధాన డ్యాం నిర్మాణం, 12 గేట్ల అమరిక పూర్తికావడం వల్ల సోమశిలలో 78 టి ఎం సి ల నీటిని నిల్వచేసే సదుపాయం ఏర్పడింది. అయితే కడపజిల్లాలో మునిగిపోయే భూములకు నష్టపరిహారంచెల్లింపు ఇంకా జరగక పోవడంతో కేవలం 48 టి ఎం సి ల నీళ్లే నిల్వచేస్తారు. తక్కినవి వృధాగా సముద్రం పాలు కావలసిందే! ఇవికాక ఒక ఐదు టి ఎం సి నీళ్ళు ప్రాజెక్టు అడుగుభాగాన ఎప్పుడూ నిల్వవుంటాయి. వాటిలో చేపలు పెంచరాదు.

1976 లో ప్రాజెక్టుకు అప్పటి ముఖ్య మంత్రి వెంగళరావు శంకుస్థాపన చేసిన నాడు 33 కోట్ల 60 లక్షల రూపాయలు వ్యయమౌతుందని అంచనా కట్టారు. అది పెరిగి పెరిగి ఇప్పుడు 199.10 కోట్ల రూపాయలకు ఎగప్రాకింది. ఇందులో ఇప్పటివరకు 100 కోట్ల 68 లక్షలు వ్యయం చేశారు. ఇంకా 70 కోట్లు ఖర్చు పెట్టనిదే ప్రాజెక్టు పూర్తికాదు.

తక్రాజంగల్, నాగార్జునసాగర్ వంటి వాటితో పోల్చినప్పుడు సోమశిల రాలా చిన్న ప్రాజెక్టే అయినప్పటికీ; సాంకేతిక పరిస్థితుల దృష్ట్యా దీనికి దేశంలోనే విశిష్ట ప్రాధాన్యత వుంది. 1168 అడుగుల ఆనకట్టను మట్టితో నిర్మించారు. దీని ఎత్తు 135 అడుగులు. దానిక్రింది 200 అడుగుల లోతువరకు ప్లాస్టిక్ కాంక్రీట్ తో రెండడుగుల వెడల్పు డయాఫ్రం గోడలు రెండు నిర్మించారు. రెండు గోడల మధ్య ఖాళీని సిమెంట్ కాంక్రీట్ తో నింపారు. ఇటువంటి ప్రత్యేక పునాది నిర్మాణం దేశంలో మరెక్కడాలేదు.

ప్రాజెక్టుకు ఎడమవైపు నుంచి ఉత్తరపు కాల్వ త్రవ్వాలి, దీనిపొడుగు 73.93 కి. మీ; 40 కిలోమీటర్లవరకు మాత్రమే తవ్వారిప్పటికి. ఇది పూర్తయితే, ఆత్మకూరు తాలూకాలో 28వేల ఎకరాలు సాగౌతాయి. దక్షిణపుకాల్వ (76.20కిలోమీటర్లు). సోమశిలకు పోను మిగిలే వరదనీటిని కండ్లేరు జలాశయానికి చేరుస్తుంది. 16 వేల ఎకరాల కొత్తపొలంసాగౌతుంది. మొత్తంమీద సోమశిల ప్రాజెక్టు ద్వారా 4 లక్షల 14వేల ఎకరాలకు నీటిపారుదల సౌకర్యం కల్గుతుందని అంచనా! దానితో పాటుగా భూగర్భ జలమట్టం పెరుగుతుంది కాబట్టి మంచినీళ్ళ కరువు సైతం శాశ్వతంగా తొలగిపోతుంది.

సోమశిల ప్రాజెక్టు చరిత్రను మరొక సారి ముచ్చటించుకుందాం! ★



## జిల్లావార్తలు

(6వ పేజీ తరువాయి)

పర్చి, పిల్లలకు బల్ల వుంటవు; టి.వి.లలో చోటిస్తానంటారు తెలుగుదేశం ప్రభువులు!

### ఇందిరాగాంధీ జయంతి

ఈక్రింది గ్రామాల్లో 19 తేది స్వర్గీయ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ జన్మదినోత్సవ వేడుకలు అతివైభవంగా జరిగాయి.

ఇందుకూరుపేట: మండల ప్రజా పరిషత్ అధ్యక్షులు శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి అధ్యక్షతన ఇందిరాగాంధీ జయంతిసభ జరిగింది. మాజీ శాసనమండలి సభ్యుడు శ్రీ గునుపాటి రామచంద్రారెడ్డి ఇందిరా స్మారక స్కాలర్‌షిప్పులను ప్రదానం చేశారు. మండల అభివృద్ధి అధికారి శ్రీ టి. బసవనాగయ్య, శ్రీ కామేశ్వరరావు తదితరులు ప్రసంగించారు.

• • •

గూడూరు: యన్. ఎస్. యు. విద్యార్థుల నాయకత్వంలో ఇందిర జయంతి ఉత్సవం జరిగింది. మాళవ్యానగర్‌లో జరిగినసభలో శ్రీ వై. రవీంద్ర, శ్రీ ఎస్. నాగరాజరావు, శ్రీ కె. శ్రీనివాసులురెడ్డి, పలువురు ఇందిరాగాంధీ అభిమానులు పాల్గొని, శ్రద్ధాంజలిఘటించారు.

• • •

కోవూరు: ఆర్యవైశ్య కళ్యాణ నిలయంలో కాంగ్రెస్‌నాయకులు శ్రీ డి. వెంకటేశ్వర్లు, శ్రీ అంజనరావు తదితరుల నాయకత్వంలో సుమారు రెండువేల మంది పేదప్రజలకు అన్నదానంచేశారు.

• • •

కావలి: కాంగ్రెస్ ప్రముఖులు సైకిల్‌పందాలు నిర్వహించారు. విజేతలకు మున్సిపల్ వైస్ ఛైర్మన్ శ్రీ గ్రంధి యానాదిశెట్టి బహుమతులుపంచారు.

• • •

పొదలకూరు: కాంగ్రెస్ నాయకులు ఇందిరాగాంధీ చిత్రానికి పూలమాలలువేసి శ్రద్ధాంజలి ఘటించారు. బడిపిల్లలకు మిఠాయిలు పంచారు.

### కిరోసిన్ ధర పెరిగింది

అమ్మకంపన్ను పెరిగిన కారణంగా కిరోసిన్ ధర పెరిగిందట. అందువల్ల ఇక మీదట కిరోసిన్ రిటైలు ధరలు లీటరుకు నెల్లూరు, ఇందుకూరుపేట, రాపూరు, కోవూరు ప్రాంతాల్లో రూ. 2.40; కావలిలో రూ. 2.44; గూడూరు, వెంకటగిరి, వాకాడులో రూ 2.42; ఆత్మకూరు, నాయుడుపేట, ఉదయగిరి, సూళ్ళూరుపేట, వింజమూరు ప్రాంతాలలో రూ. 2.40; పొదలకూరులో రూ 2.4[illegible] వుంటాయట.

### ప్రిన్సిపాల్ ను నియమించండి

కోవూరు టి. ఎమ్. సి. జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్ పదవీవిరమణచేసి నెలరోజులు దాటినా, ఇంతవరకు ఆ ఖాళీని భర్తీచేయలేదట. అందువల్ల ఆ కాలేజీలో పనిచేస్తున్న సిబ్బందికి బిల్లులు పాసుచేసే అధికారిలేక జీతాలు చెల్లించడం లేదట. ఇన్‌ఛార్జి ప్రిన్సిపాల్‌ను నియమించినా, ఆయనకు పూర్తి బాధ్యతలు అప్పగించకపోవడంవల్ల ఈ పరిస్థితి ఎదురైందట. ఇప్పటికీ ఇన్‌ఛార్జి ప్రిన్సిపాల్ కూడా సెలవుపెట్టి పోవడంతో కాలేజీలో పరిస్థితి అగమ్యగోచరంగా వుందని, తనుక వెంటనే ప్రిన్సిపాల్‌ను నియమించి, పరిస్థితి చక్కదిద్దాలని కళాశాల సిబ్బంది కోరుతున్నారు.

### మార్కెట్ కమిటీ అధికారుల భంగపాటు

మార్కెట్ కమిటీ అధికారబృందం పడుగుపాడులో ఒక భూమిని స్వాధీనం చేసుకునే విషయంలో రెండుసార్లు కోర్టులో ఓడిపోయినా, మరల ముచ్చటగా మూడో సారి అదేభూమిని స్వాధీనం చేసుకోవాలని తీవ్రంగా ప్రయత్నిస్తున్నదట. కోవూరు మార్కెటింగ్ కమిటీవారు గిడ్డంగుల నిర్మాణం చేపట్టడంకోసం అయిదేళ్ళక్రిందట పడుగుపాడుగ్రామంలో ఒకభూమిని ఆక్రమించుకోవడం జరిగింది. అప్పుడు ఆ భూస్వాములు కోర్టును ఆశ్రయించగా వారికే అనుకూలంగా కోర్టు తీర్పుయిచ్చింది. కాని మార్కెట్ కమిటీ అధికారులు మరల అదే భూమిని స్వాధీనం చేసుకున్నారు. తరువాత ఆ భూమిగల యజమానులు మరలా కోర్టుకెళ్ళారు. అపుడు కూడా కోర్టు ఆ భూమిగలవారికే అనుకూలంగాతీర్పుచెప్పింది. మళ్ళీఇప్పుడు మూడో సారి అదేభూమిని స్వాధీనం చేసుకోవాలని తాపత్రయపడుతున్నారట అధికారులు. మార్కెట్ యార్డ్ నిర్మాణంకోసం కావలసినంత భూమి వుండగా కోర్టును ధిక్కరిస్తూ అదేభూమిని ఎందుకు స్వాధీనం చేసుకోవాలనుకుంటున్నారో అర్థం కావడంలేదని ఆ రైతులు లబోదిబోమంటున్నారు.

ఇందులో ఏమి రాజకీయమున్నదో, ఎవరి అదృశ్యహస్తం వున్నదో ఎవరికి తెలుసు! వేరే భూమి లేకుంటేతప్ప అధికార్లు అంత పట్టుబట్టడం విపరీతమే అవుతుంది.

## • శ్రద్ధాంజలి •

స్వర్గీయ కూకటి కోదండరామరెడ్డిగారి కుమారుడు

పేదలపెన్నిధి, సహృదయుడు

# శ్రీ కూకటి పేరారెడ్డిగారు

15-11-88 తేది దేవుని సన్నిధి చేరినారు.

వారి ఆత్మకు దైవసన్నిధిన చిరశాంతి ప్రసాదించమని, ఉత్తరజన్మ ఇంతను ఉత్తమజన్మ కలగాలని, ప్రార్థిస్తూ, వారికి ప్రగాఢ శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

వారి ఉత్తరక్రియలు

27-11-88 తేది ఆదివారం శిలాప్రతిష్ఠ

28-11-88 తేది సోమవారం శిలోద్వాసన

నెల్లూరు, గాంధినగర్‌లో మా స్వగృహమున జరుగును. కావున బంధు మిత్రులు తెలియగోరుతాము.

-కూకటి రాజేశ్వరమ్మ, కుటుంబ సభ్యులు



శ్రీ కూకటి పేరారెడ్డిగారు



దానధర్మాలలో మాకు కీర్తి తెచ్చిన

మా ఇలవేల్పు, మమ్మల్ని కంటికి రెప్పలా కాపాడిన

# శ్రీమతి సన్నపురెడ్డి కామాక్షమ్మగారు

18-11-88 తేది శుక్రవారం స్వర్గస్తురాలైనది.

27-11-88 తేది ఆదివారం పెద్దకర్మ

చిన్న చెరుకూరులో జరుగును.

కుమారులు-కోడళ్ళు :

సన్నపురెడ్డి దశరథరామిరెడ్డి-హైమావతమ్మ

సన్నపురెడ్డి శ్రీనివాసులురెడ్డి-జయలక్ష్మమ్మ

మనుమలు :

సురేంద్ర-అనిత; సురేష్-రాణి; వెంకటకృష్ణ-హైమావతి; సుధీర్

మనుమరాలు : సురేఖ-నరేంద్ర

తమ్ముళ్లు : మారంరెడ్డి రమణారెడ్డి, చంద్రశేఖరరెడ్డి

చెల్లెళ్లు : కాంతమ్మ, వనజాక్షమ్మ, లీలావతమ్మ

Edited, Published & Printed by N. Dolendra Prasad at the Zamin Ryot Press, Nellore - 524 001